## కావలెను.

"యు. యల్. సి. యం. మిడిల్ స్కూల్, రాజమండ్రి. భాషాప్రవీణ II గ్రేడ్ తెలుగుపండితులు కావలెను. Apply to the Correspondent."



## మా కవిత్వ గానసభ

హైస్కూల్సు కాలేజీలు (స్పెషల్ ఫీసులో, ఖర్చులు పెట్టి) పిల్వండి; మా గ్రంథాల్లో పుస్తకాల్లో కావ్య మిచ్చెయిస్తారా? (పుష్పగిరినామాల రామచంద్రరావు, బ్రాడీపేట, గుంటూరు).

## కావలెను

శ్రీ శరభయ్య సప్త హైందవ హైస్కూలు, సత్తెనపల్లి (గుంటూరుజిల్లా) ఒక వివింగు మాస్టరు, ఒక క్రాఫ్టు మాస్టరు-పోస్టులకు సెక్రెటెంటు, గవర్నమెంటు జీతములు యివ్వబడును. వెంటనే దరఖాస్తులు కరెస్పాండెంటు గారికి 15-9-1952 తేదీలోపుల పంపకోరుతాము.

## టెండరు నోటీసు

గుంటూరు జిల్లా తెనాలితాలూకా అమృతలూరు పంచాయతీ బోర్డు ఆఫీసులో 15-9-1952 తేదీ సాయంత్రము 5 గంటలవరకు ప్రసిడెంటు గారిచే యీ దిగువ పుదహరించబడిన టెండర్లు తీసుకొనబడును. వివరములు రు. 1-0-0 చెల్లించి స్వయముగా గాని పోస్టు ద్వారా గాని తెప్పించుకొనవచ్చును. టెండరు:

(1) రోడ్లకు మెటల్, రబ్బిషు వేయుట రు. 21,000/- డిపాజిట్టు రు. 1,050/-

(2) రోడ్లకు మొరంపు కూర్పులు వేయుట ... రు. 250/- డిపాజిట్టు రు. 12-8-0

(3) స్టేషనరీ సామానులు. డిపాజిట్టు రు. 10-0-0

(4) లైటింగు సామానులు. డిపాజిట్టు రు. 20-0-0

రావిపర్ల వెంకటశివయ్య, ప్రసిడెంటు, పంచాయతీ బోర్డు, అమృతలూరు. 8-8-52.







Edited Printed & Published by S. Sambhu Printed at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.

# రేడియో

## గురువారం, సెప్టెంబరు 4 వ తేదీ

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె, 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, 1 మద్రాసు (బి) వలె, 1-30 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వా॥, 1-50 తెలుగున వా॥, 2 మద్రాసు (బి) వలె, 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు, 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

సా॥ 5-30 యస్. రంగనాయకి (గాత్రం), 6-50 వి. యస్. అనంతరావు: వీణ, 6-10 స్థానిక వా॥, వాతావరణం, 6-20 గీతమంజరి (రి), 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వా॥, 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 సంగీతశిక్షణ, 7-45 మహాప్రళయం (నాటిక), రచన: వి. శివరామారావు, 8-15 పాట్నా రేడియో ఆర్కెస్ట్రా, 8-30 యస్. రంగనాయకి (గాత్రం), 9 ఆంగ్లమున వా॥, 9-15 గీతావళి: ప్రతి సత్యవతి.

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతం, 7-15 తమిళమున వా॥, 7-30 కె. యస్. కృష్ణమూర్తి (గాత్రం), 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 1 మహిళా మండలి, 1-30 గీతమంజరి (రి), 1-40 హిందీలో వా॥, 1-50 గీతమంజరి (రి), 2 తమిళమున వా॥, 2-10 మద్రాసు (బి) వలె, 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 యం. గోపాల పిళ్లై: నాదస్వరం, 6 ఆంగ్లమున వా॥, 6-10 స్థానిక ప్రకటనలు, వాతావరణం, వాణిజ్యవా॥ (ఆంగ్లం) 6-20 కల్యాణం సుబ్రహ్మణ్యం (గాత్రం) 7-0 అనంత భారతి కృతులు (రి) 7-15 తమిళమున వా॥ ఇదివాలం ఇసయుం (తమిళ ప్రసంగం) 7-50 మద్రాసు (బి) వలె 8-15 రాగం, తాళం, పల్లవి 9-0 ఆంగ్లమున వా॥ సైనా (ఆంగ్ల ప్రసంగం) 9-30 మద్రాసు (బి) వలె 10-0 పాశ్చాత్య సంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 యం. యస్. సుబ్బలక్ష్మి (రి) 7-30 మద్రాసు (ఎ) వలె.

మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 గీతమాలిక (రి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 గీతమంజరి (రి) 1-50 తెలుగున వా॥ 2-0 డిల్లీరావా నిలయ విద్వాంసుడు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు 4-30 మద్రాసు (ఎ) వలె.

సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 కోమలవల్లి జి. శ్రీనివాసన్ వయొలిన్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 అనుష్ఠాన సంగీతము 7-45 గీతమంజరి (రి) 8-0 కేరళదేశపు జానపద గేయాలు 8-15 మద్రాసు (ఎ) వలె 9-30 మనకాల్ యస్. వరదరాజన్ (గాత్రం) 10-0 గానమాలిక (రి).

### హైదరాబాదు

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 స్వరూపిణీ శ్రీనివాసన్ 7-45 ఖ్యాల్ భైరవ్ బాపూరావ్ జోషీ 8-0 ఆంగ్లమున వా॥ 8-15 భజనసింఘా జాగీర్దార్ 8-25 సారంగి అమన్ బక్ష్, 8-35 కవాలీ; హాషమ్ అలీ, సాథీ, 8-45 ఖ్యాల్ దేశకర్: బాపూరావ్ జోషి, 9 ఉర్దూలో వార్తలు.

మ॥ 12-30 ఘజల్, కవాలీ (రి) 12-50 మహారాష్ట్రమున వార్తలు, స్త్రీసంసార్ 1-30 ఆంగ్లమున వా॥ 1-40 గేయావళి (రి) 1-50 తెలుగున వార్తలు.

సా॥ 5-30 బాలవినోదం, 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు, 6-15 భజన్, సింధూ జాగీర్దార్ 6-25 ఖ్యాల్ బాపూరావు జోష్యి; 6-35 హాషిమ్ అలీ, సాథీ 6-45 గ్రామసీమ; 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ 7-55 కన్నడమున వా॥ 8 ఉర్దూలో వా॥ 8-15 సాంఘికరాజనీతి (ఉర్దూ ప్రసంగం) 8-30 కవాలీ హాషిమ్ అలీ సాథీ 8-00 విశ్వవిద్యాలయాల కార్యక్రమం 8-55 సితార్ (రి) 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 సినీకోరిన పాటలు. (రి).

## కీ॥ శే॥ గోదవర్తి నాగేశ్వరరావుగారు

మార్టేరు, ఆగస్టు 30: ఆదంటి నాస్థిప్యులు శ్రీ గోదవర్తి నాగేశ్వరరావుగారు హృద్రోగముచే 28 వ తేదీ ఉదయం 11 గంటలకు ఆకస్మికంగా చనిపోయారు. వీరి వయస్సు సుమారు 55 సం॥లు. సంపన్న గృహస్థులు. ఆచంటి పరిసర గ్రామములలో మంచి పేరు పొందిన వారు. వీరి మరణమునకు ఆచంట వాసులు చాలా విచారించారు. స్వ.వి.

## నూతిలో శవం

మదరాసు, సెప్టెంబరు 1: నాగేశ్వరపురంలో ఒక నూతియందు గోపాలకృష్ణన్ అను 25 ఏండ్లవాని శవమొకటి నిన్న గమనించి యుండిరి. పోలీసులు దానిని బయటకు తీసుకువచ్చిరి. కేసువున్నాళ్లో అనే 65 ఏండ్ల ముసలి ఒకని యింట్లో పనిచేస్తూ, ఆ నూతిలో పడి చనిపోయింది.

## నెల్లూరు మున్సిపల్ ఎన్నికలు

### అక్టోబరు 6 వ తేదీన పోలింగు

నెల్లూరు, ఆగస్టు 31: ఈ పురపాలక సంఘమునకు అక్టోబరు 6 వ తేదీన ఎన్నికలు జరుగుతవి. సెప్టెంబరు 5, 6, 8 తేదీలలో నామినేషన్ల స్వీకారం, 9 వ తేదీన పరిశీలన జరుగునని, మున్సిపల్ కమీషనర్ గారు ప్రకటించారు.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు పోటీచేయడం లేదు. ఎన్నికల ప్రచారంలో 'స్వతంత్ర పార్కు' "బస్సుస్టాండు" యీ రెండు ప్రధాన సమస్యలైనాయి. భారత దేశమునకు స్వాతంత్ర్యం వచ్చిన రోజున, యిక్కడ స్వతంత్ర పార్కు యేర్పాటు చేశారు. కాని యీ 5 ఏండ్లుగ్గా, పార్కు అభివృద్ధి కాలేదు. ఆ పార్కునకు ఒక ప్రక్క కో ఆపరేటివ్ బ్యాంకు, ఒక ప్రక్క సినీమాహాలు, ముందు ట్రంకు రోడ్డు ఉన్నవి. పార్కునకు సంబంధించి ముందున్న స్థలాన్ని కవున్సిల్ వారు కొందరికి అమ్మివేయడానికి లోగడ తీర్మానించారు. ఈ తీర్మానంపై కొందరు కౌన్సిలర్లు, ఈ స్థలాన్ని అమ్మడానికి వీల్లేదని, మంత్రులకు తదితర ఉన్నతాధికారులకు అధిక్షేపణలు పంపారు. ఇప్పుడీ పార్కు విషయాన్ని ఎన్నికల ప్రచారానికి బాగా వినియోగించుకొంటున్నారు.

మరికొందరు అభ్యర్థులు బస్సుస్టాండు స్వతంత్ర పార్కుకు మార్చి, స్వతంత్ర బస్సుస్టాండు అని వ్యవహరించాలని ప్రచారం చేస్తున్నారు.

### భీమునిపట్నం

ఈ పురపాలక సంఘమునకు అక్టోబరు 6న ఎన్నికలు జరుగును. సెప్టెంబరు 5, 6, 8 తేదీలలో నామినేషన్ల స్వీకారము, 9వ తేదీన పరిశీలన జరుగును. అప్పీల్లేని నామినేషన్లు సెప్టెంబరు 18వ తేదీన ప్రకటిస్తారు.

### రాజమండ్రి

ఈ పురపాలక సంఘమునకు ఎన్నికలు అక్టోబరు 6 వ తేదీన జరుగుతాయి. నామినేషన్లు సెప్టెంబరు 5, 6, 8, 9 తేదీలలో స్వీకరింపబడును. 9వ తేదీన పరిశీలన జరుగును. అప్పీళ్ళులేని నామినేషన్లు సెప్టెంబరు 13 వ తేదీ, అప్పీళ్ళున్న వాటిని 17 వ తేదీన ప్రకటిస్తారు.

### కర్నూలు 17 గురు అభ్యర్థుల ఉపసంహారాలు

ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో నామినేషన్లు వేసిన 17 గురు వాటిని ఉపసంహరించుకున్నారు. ఇందువల్ల మరి రెండు స్థానాలకు పోటీలేకుండా పోయింది. 29 స్థానాలకు అక్టోబరు 16-వ ఎన్నికలు జరుగుతాయి. (స్వ. వి.)

### మునిసిపల్ ఎన్నికల్లో చెరగని సిరా ఉపయోగించాలి:

మద్రాసు శాసనసభ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు టి. నాగిరెడ్డిగారిలా వ్రాస్తున్నారు. "మున్సిపల్ ఎన్నికలలో, చెరగని సిరా ఉపయోగించకుండా ఉండుటకు ప్రభుత్వం నిశ్చయించినట్లు తెలియవచ్చింది. ఈ సిరా ఎందుకు ఉపయోగించుకుండ ఉండాలో నాకు అర్థంగావడంలేదు. జనరల్ ఎన్నికల్లో కంటె గూడా, మున్సిపల్ ఎన్నికలలోనూ, తదితర స్థానిక సంస్థల ఎన్నికల్లోనూ దొంగ ఓట్లకు ఎక్కువ అవకాశం ఉంటుంది. ఓటింగులో అక్రమ పద్ధతులు, నిజమైన ఓటర్ల కాదా అన్న విషయమై ఆక్షేపణ, ప్రత్యాపేక్షలు మొదలైన తగాదాలు తగ్గించడానికి యీ సిరా ఉపయోగించడం చాలా అవసరం. ఈ సిరా ఉపయోగించుటకు వెంటనే తగు యేర్పాట్లు చేయాలని స్థానిక సంస్థల మంత్రికి నా విజ్ఞప్తి"

## ఆంధ్రవిశ్వ విద్యాలయ సెనేట్ ఉప ఎన్నికలు

వాల్తేరు, ఆగస్టు 29: ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల తెలుగుభాషా నియోజకవర్గంనుండి, ఆంధ్ర విద్యాలయం సెనేట్ స్థానమునకు జరిగే ఉపఎన్నికకు ఈ దిగువవారి నామినేషన్లు సక్రమముగా ఉన్నట్లు ప్రకటింపబడినవి. జి. యస్. ఎన్. ఆచార్య (రాజమండ్రి ఆర్ట్సు కాలేజి) విద్వాన్ కె. మాధవరామశర్మ (ఎ. సి. కాలేజి గుంటూరు) విద్వాన్ ఎ. నాగగోపాలరావు (సి. ఆర్. ఆర్. కాలేజి ఏలూరు) సెప్టెంబరు 4 వ తేదీ ఓటింగు కాగితాలు ఓటర్లకు జారీ చేయబడతాయి. సెప్టెంబర్ 15 వ తేదీ సాయంత్రం 4 గం॥ లకు వీటిని పూర్తిచేసి పంపాలి.

## బ్లాక్ మార్కెట్ నేరాలు

### పెద్ద వారిపట్ల అధికార్ల వైఖరి

కొవ్వూరు, ఆగస్టు 31: ఒకనాటి పురుషోత్తమపాడి టాంపెన్ గారి పనివాడు బజారుకు వెళ్లి కొన్ని వస్తువులను బ్లాక్ మార్కెట్లో కొనుక్కువచ్చాడు. ఈ విషయం తెల్సుకొని టాంపెన్ గారు అధికారులవద్దకు పోయి ఆతనిపై చర్య తీసుకోమని కోరారు. "వీరు సుహోసుప్యాలు. వారిపై చర్య తీసుకోలేము" అని అన్నారు. ... టాంపెన్ వెల్లడించారు.

## "అశోక్ విహార్" వార్షికోత్సవం

మద్రాసు, ఆగస్టు 31: ఆరోగ్య మంత్రి శ్రీ ఎ. బి. శెట్టి చక్కటి ప్రజా సేవ చేయుచున్నందుకు అశోక్ విహార్ ను అటువంటి సంస్థను ఏర్పాటు చేసినందుకు కార్పొరేషన్ను అభినందిస్తూ విశ్వవిద్యాలయాల విద్యార్థులు మురికిగూడెములలో వుంటూ పేద ప్రజల కష్టములను గ్రహించి అవసరమైన వైద్యసహాయం చేసి వారి జీవితమును సుఖప్రదం చేయుటకు కృషి చేయాలని కోరారు.

అశోక్ విహార చతుర్థ వార్షికోత్సవమును ప్రారంభిస్తూ అశోక్ విహార్ ను బొత్ లండన బరోలో 1926 సంవత్సరంలో ప్రారంభించిన పెక్ హాం హెల్తు సెంటర్ నమూనాలో ఏర్పాటు చేసినట్లు కనబడుతోందనీ పెక్ హాం సెంటర్లో వలెనే అశోక్ విహార్ కూడ ఆరోగ్య సేవ నేగాక విద్య, చేతిపనులనుకూడ ఏర్పాటు చేయాలని మంత్రిగారు సూచించారు.

మేయర్ శ్రీ శిబగ్ తుల్లా మంత్రిగారికి స్వాగతం ఇచ్చారు. అశోక్ విహార్ డైరెక్టరు డా॥ పి. ఎస్. సంబంధం వార్షిక నివేదికను సమర్పించారు. కమిషనర్ నరసింహాం వందనములర్పించారు.

## రాష్ట్రంలో ప్రజారోగ్యం

మదరాసు, సెప్టెంబరు 1: ఆగస్టు 16 తేదీతో అంతమైన వారంలో రాష్ట్రంలో కలరా తగ్గుముఖంలో వుంది, శ్రీకాకుళం, గుంటూరు తిరుచి కర్నూలు, ఉత్తరఆర్కాటు జిల్లాలలో కొంచెం ఎక్కువగ నెల్లూరు, చిత్తూరుజిల్లాలో విపరీతంగ కలరా వ్యాధి వున్నట్లు తెలుస్తున్నది. ఇతర జిల్లాలలో తగ్గుముఖంగ వుంది. మదరాసు నగరంలో ఈ వారం 3 గురికి కలరాతగిలి ఒకడు మరణించాడు.

ఈ వారంలో మశూచివ్యాధి కొంచెం ఎక్కువఅయింది. చెంగల్పట్, తంజావూరు జిల్లాల్లో పెరుగుదలే ఇందుకు కారణం. మదరాసు నగరంలో 17 గురికి వ్యాధి తగిలి ఒకరు మరణించారు.

## కార్పొరేషన్ పఠన మందిరం

మదరాసు, ఆగస్టు 31: మేయర్ శ్రీ శిబగ్ తుల్లా చేసిన బ్రిడ్జి పడవట్ట అమ్మన్ కోయిల్ వీధిలో కార్పొరేషన్ పఠన మందిరమును ప్రారంభించారు.

కమిషనర్ శ్రీ నరసింహ్యం ప్రారంభోత్సవం జరుపవలసిందిగ మేయర్ను కోరుతూ ఇంతవరకు నగరంలో కార్పొరేషన్ 70 పఠన మందిరములను ఏర్పాటు చేసిందని చెప్పి పఠన మందిరములు విరివిగ ఉపయోగించుకోవలసిందిగ స్థానిక ప్రజలను కోరారు.

డివిజనల్ కవున్సిలర్ శ్రీ కే. రామలింగం వందనము లర్పించారు.

## భూమి సమస్యల పరిష్కారం

### కమ్యూనిస్టునాయకుని సూచనలు

మధుర, ఆగస్టు 31: తొలగింపబడిన కౌలుదార్ల హక్కులు తక్షణం తిరిగి వారికి సంక్రమింపచెట్టు చేయుటకై భూస్వాములూ, కిసాన్ సభల ప్రతినిధులూ, ప్రభుత్వ ప్రతినిధులలో ఒక త్రైపక్షిక సభను ఏర్పాటు చేయవలసిందిగా కమ్యూనిస్టు యం. యల్. ఏ. పి. రామమూర్తిగారు రాష్ట్రప్రభుత్వాన్ని కోరారు.

తంజావూరు జిల్లాలో 3 రోజులు పర్యటించి రామమూర్తిగారు ఇవాళ ఇక్కడికి వచ్చారు. తంజావూరు కౌలుదారీ ఆర్డినెన్సును గురించి మాట్లాడుతూ, "ఆర్డినెన్సులో కౌలుదార్లకు నిర్ణయించిన పంటభాగం ఇప్పుడున్న దానికంటె చాలా తక్కువగా ఉన్నదని జిల్లా రైతులోకమంతా అభిప్రాయపడుతున్న"దని ఆయన అన్నారు.

## సెకండరీ విద్యాసంస్కరణ

### డైరెక్టరు అభిప్రాయం

తంజావూరు, ఆగస్టు 31: సెకండరీ విద్య పునర్వ్యవస్థ ఒక్క ఉపాధ్యాయుల సమ్మతితో మాత్రమే కాక సంఘమంతటి సమ్మతితో జరుపవలెనని విశ్వవిద్యాశాఖ డైరెక్టరు యస్. గోవిందరాజులుగారు ఇవాళ ఇక్కడ తిరుకాట్టుపల్లిలో జరిగిన తంజావూరు జిల్లా విద్యాసభ ప్రారంభోత్సవ సందర్భంలో చెప్పారు. ఇప్పటి సెకండరీ విద్యావిధానాన్ని మూలముట్టంగా ఖండించి నేయడం ఎంతవరకు న్యాయమో ఉపాధ్యాయులు పునరాలోచన చేసికోవలెనని ఆయన అన్నారు. డాక్టరు ఎ. లక్ష్మణస్వామి మొదలియారుగారు కార్యదర్శిగా యీ నియమించిన సెకండరీ విద్యాసంఘంతో సహకరించవలసిందిగా ఉపాధ్యాయులను కోరారు.

ప్రాంతీయ సభలో ఆహ్వానసంఘ అధ్యక్షుడుగా సెకండరీవిద్య చిరకాలంగా పోరాటం సాగిస్తున్న ... యస్. ... గారు తమ అధ్యక్ష ప్రసంగంలో చెప్పారు.

## క్రీడారంగం:

## ఇండియా హాంప్ షైర్ క్రికెట్ పోటీ

### ఉమ్రిగర్ మరో సెంచరీ

బోర్నమౌత్, సెప్టెంబర్ 1:— ఇండియా హాంప్ షైర్ క్రికెట్ మాచ్ లో ఇవ్వాళ పాలీ ఉమ్రిగర్ మరో సెంచరీకొట్టాడు. ఉమ్రిగర్ ఇవ్వాళ మొత్తం 165 పరుగులు తీసి అవుటు కాకుండా నిలిచాడు. ప్రజతో కూడిన ఇతని ఆటవల్ల ఇండియా మొదటి ఇన్నింగ్సులో 7 వికెట్లకు 357 పరుగులు చేశారు. ఇది హాంప్ షైర్ మొదటి ఇన్నింగ్సు స్కోరు కంటే 101 ఎక్కువ. ఇండియా మొదటి ఇన్నింగ్సు ముగించాక హాంప్ షైర్ రెండో ఇన్నింగ్సు ప్రారంభించి ఆట చాలించేసరికి 1 వికెట్ నష్టానికి 5 పరుగులు తీశారు.

ఉమ్రిగర్ ఇవ్వాళ మొత్తం 4 గం. 20 ని. సేపు ఆడాడు. నాలుగుసిక్సర్లు, 24 బౌండరీలు కొట్టాడు. ఈ పర్యటనలో ఇలిడు సెంచరీస్కోరు చేయడం 5-వ సారి. మొత్తం అన్ని మాచ్ లు కలిపి 1500 పరుగులు తీశాడు.

ఇవ్వాళటి ఆటలో ఇండియా టీములోని మిగతావారు ఈ విధంగాపరుగులు తీశారు: గయక్వాడ్ 69, రాయ్ 0, అధికారి 1, మంత్రేకర్ 35, ఫడ్కర్ 37, దివేచా 30, సర్వాటే 6, ఎక్ స్ట్రాలు 14.

## చిత్తూరుజిల్లా గ్రిగ్ స్మారక పోటీలు

తిరుపతి, ఆగస్టు 29: చిత్తూరు జిల్లా గ్రిగ్ స్మారక ఆటలపోటీలు ఈయేడాది తిరుపతిలో జరుగుతాయి. జిల్లా అథ్లెటిక్ అసోసియేషను కార్యవర్గంగా ఈ దిగువవారిని ఎన్నుకొన్నారు: అధ్యక్షుడు-జిల్లా విద్యాశాఖాధికారి, ఉపాధ్యక్షులు-వ్యాయామవిద్య ప్రాంతీయ ఇన్స్పెక్టరు, టి. రంగారెడ్డి, ప్రధాన కార్యదర్శి-ఎం. ముత్రంరెడ్డి ఆటల కార్యదర్శి-సి. కె. కె. ఆర్. జయరామ కృష్ణన్, ప్రాంతీయ కార్యదర్శులు-ఎం. శేషాచలం, డి. వి. సంపత్, పుత్తూరు ప్రాంతం: టి. రామయోగి, వ్యాయామ విద్యాబోధకుడు. తిరుపతి ప్రాంతం వి. ఎస్. వెంకటనారాయణ, పి. సుందరం, మదనపల్లి ప్రాంతం - సి. సుబ్బారావు. ఆర్. కృష్ణమూర్తి, ఆడిటర్-వై. రామిరెడ్డి.

## చిత్తూరు ఎంగ్ మెన్ అసోసియేషన్ కళా ప్రదర్శనపోటీలు

చిత్తూరు, ఆగస్టు 30: ఈనెల 23, 24 తేదీలలో, ఎంగ్ మెన్ అసోసియేషన్ వారు, స్థానికబోర్డు హైస్కూలులో వక్తృత్వం, నృత్యం, మోనోయాక్షన్, సంగీతం మొదలగు వాటిల్లో పోటీ జరిపారు.

వక్తృత్వపోటీలో: కె. సులోచనకు మొదటి బహుమానం, సి. చిదంబరమునకు రెండవ బహుమానం, నృత్యపోటీలో ఆర్. పరమేశ్వరికి మొదటి బహుమానం, పి. ఎ. సుబ్బలక్ష్మికి రెండవ బహుమానం, మోనోయాక్షన్ పోటీలో అన్వర్ కు మొదటి బహుమానం, వైరంగరాజును ద్వితీయ బహుమానం, సంగీతం పోటీలు వి. వెంకటసుబ్బరామన్ కు, మొదటి బహుమానం లభించినవి. జూనియర్ విద్యార్థినులలో, కె. జానకికి మొదటి బహుమానం నె. శాంతామణికి రెండవ బహుమానం పి. రాజేశ్వరికి మూడవ బహుమానం వచ్చినవి. ఈ బహుమతులన్నీ త్వరలో జరుగనున్న వార్షికోత్సవ సందర్భమున వారికి యివ్వబడును. రెండవనాటి సంగీతపోటీ కార్యక్రమం, ఆర్. బి. కృష్ణంరాజుగారి అధ్యక్షతన జరిగినది. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, ఎంగ్ మెన్ అసోసియేషన్ వారి కళా ప్రదర్శనపోటీలను శ్లాఘింపుతూ, కర్ణాటక, హిందూస్థానీ సంగీతములకు గల తారతమ్యమునుగూర్చి, ఏసంగీతం,యెప్పుడే యే ప్రాంతాలలో ప్రాబల్యముగా నున్నదీ వివరించారు. ఆంధ్రదేశంలో కర్ణాటక సంగీతమునకున్న ప్రాధాన్యతను గురించి సోదాహరణంగా చెబుతూ, భారతాచార్యుల కాలం నుంచీ, తాళ్లపాక అన్నమాచార్యులు, దీక్షితుల కాలంవరకు, ఆంధ్రదేశంలో సంగీతం వన్నె కెక్కి ఉన్నదని చెప్పారు. సభలో అన్నమాచార్యుల కీర్తనలను కొన్నింటిని శర్మగారు పాడారు.

అధ్యక్షులు రామకృష్ణం రాజుగారు ఎంగ్ మెన్ అసోసియేషన్ కృషిని ప్రశంసిస్తూ, అనంతకృష్ణ శర్మగారి హితవు పాటించవలెనని చెప్పారు. (స్వ. వి.)

## ఆంధ్రరాష్ట్ర చెడుగుడు పోటీలు

సూజపేట, సెప్టెంబరు 1: స్థానిక స్పోర్టింగ్ క్లబ్ వారు ఈ 20 మండి ఇక్కడ ఆంధ్ర రాష్ట్ర చెడుగుడు పోటీలు జరుపుటకు నిర్ణయించారు. ఈ నిర్ణయంచేసే నిమిత్తం క్లబ్ కమిటీ మొన్న పరిమిగొట్ట రామకృష్ణారావుగారి అధ్యక్షతను సమావేశమైంది. పోటీలలో పాల్గొనదలచినవారు ఈ నెల 15లోగా ఎంట్రీఫీజును ప్రవేశరుసుము రూ 12/-లతో క్లబ్ అధ్యక్షుని పేర మూజిడీకు కృష్ణాజిల్లాఅని పంపాలని ... తెలుపుతున్నారు. టీములో 6 గురు ఆటగాళ్ళకు మించి ఉండాలనీ, అదనంగా ఒక్కరికేదు ఉవ్వవచ్చుననీ, గెలిచేవారికి శాశ్వత కోపుంచుటలు, మొదటి బహుమతి నా రూ 180/-లు, రెండో బహుమతి నా రూ 120/-లు, ఇవ్వగలని కూడా వారు తెలుపుతున్నారు. (స్వ. వి.)

## తూ. గోదావరిజిల్లా హరిజన కాంగ్రెసు

కాకినాడ, ఆగస్టు 31: మొన్న ఆదివారంనాడు యిక్కడ సందు లక్ష్మణస్వామిగారి అధ్యక్షతన జరిగిన తూ. గోదావరిజిల్లా హరిజన కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో గత శాసనసభ ఎన్నికలందు కాంగ్రెసు వారు నిలబెట్టిన విద్యాధికులను హరిజన అభ్యర్థులను గెలిపించుకోలేక పోయిన కారణాలను గురించి విమర్శ జరిగినది. జిల్లా హరిజన ప్రజానీకమునకు సంభవించిన దుర్గతికి విచారిస్తు, హరిజనుల్లో సక్రమ రాజకీయభావాలను ప్రచారము చేయుట అవసరమని సభ్యులుఅభిప్రాయం వెల్లడించారు. కాకినాడహరిజనహాస్టలులో అక్రమములు జరుగుచున్నవని తెలుపుతూ, జిల్లా బోర్డు కమిటీసభ్యులు మెదూర్యన్ జాతులవారు సమర్పించిన విజ్ఞాపనను గురించి చర్చించి, తూ. గో. జిల్లా హరిజన సేవకసంఘ కార్యదర్శి, హరిజనహాస్టలు కార్యదర్శియైన కె. శేషగోపాలాచారి గారి విధానమును నిరసించుచు, ప్రభుత్వము తగుచర్య తీసుకొని, కార్యదర్శి పదవినుండి వారిని తొలగించాలని కోరుతూ సమావేశంలో తీర్మానం చేశారు. (ఒ. వి.)

## ఉపరాష్ట్రపతికి స్వాగతం

పూనా, ఆగస్టు 30: భారతయూనియన్ ఉపాధ్యక్షులు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, యీ 25 వ తేదీ మధ్యాహ్నం బొంబయినుండి యిక్కడికి వచ్చినప్పుడు, పూనా ఆంధ్ర సంఘాధ్యక్షులు డా॥ ఓ. కోటేశ్వరరావు, ఉపాధ్యక్షులు టి. వి. సుబ్బారావు, కార్యదర్శి సి. వెంకటేశ్వరరావుగారలు, తదితరులు, స్టేషన్ వద్ద వారికి స్వాగతమిచ్చారు. ఆసాయంత్రం ఆంధ్రసంఘ భవనమందు సభ ఏర్పాటు చేసి రాధాకృష్ణయ్యగారికి స్వాగతపత్రం సమర్పింపబడెను. పూనాలోని ఆంధ్రులందరు హాజరైనారు. తేనీటి విందు జరిగినది. 20 నిముషములపాటు రాధాకృష్ణయ్యగారి యుష్టాగోష్ఠి అనంతరం అభినందనాలతో సభ ముగిసినది. (ఒ. వి.)

## టెండరు నోటీసు

పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకా గణపవరం గ్రామములో వేంచేసి యున్న శ్రీ సువర్ణేశ్వర స్వామి వారి దేవాలయమునుండి శ్రీ స్వామివారి అలయము ప్రక్కన యున్న చెరువులోనికి సిమ్మెంటు మెట్లు (Steps) కట్టుటకు గాను సుమారు రు. 3,000/-లు అంచనా గల పనులు చేయుటకు సీలు వేయబడిన టెండర్లు సదరు దేవస్థానము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారిచే 12-9-52 తేది అనగా శుక్రవారము సాయంకాలము 4 గంటలవరకు సదరు దేవస్థానము ఆఫీసులో తీసుకొనబడును. ప్రతి టెండరుదారుడు రు. 150/-లు టెండరు డిపాజిట్టు చెల్లించి, రశీదు టెండరు దరఖాస్తుతో జతపరచవలయును. మిగతా వివరములు సదరు దేవస్థానము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారి ఆఫీసులో ఆఫీసు పనిచేయు కాలములో తెలుసుకొనవలయును.

నర్రా రామకృష్ణరావు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, శ్రీసువర్ణేశ్వరస్వామివారి దేవస్థానం గణపవరం. 30-8-1952.





## తెలుగు క్రాసువర్డు పజిలు నెం. 3, కాకినాడ.

### తప్పక గెలవండి రూ 1000 గ్యారంటీ

రైటు ఆన్సరుకి 500/- ఒకతప్పుకి 250/- రెండుతప్పులకు 150/- మూడుతప్పులకు 100/-

30 కూపన్లు పైగా పంపినవార్కి ప్రత్యేక బహుమతులు యివ్వబడును.

బహుమతులిచ్చే సొమ్ము రూ. 1000/- లున్నూ కీసొల్యూషనూ కాకినాడ కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకిలో డిపాజిట్టు చేయడమైనది.

ముగింపు తేది 15—9—52



ఆధారములు అడ్డము.

1. గంగాదేవి కుమారుడు.
2. కొందరికి ప్రియమైన దైవము.
3. ఉపనయనము.
4. పురుషులు సరింపుకొంటే దీనిని పుట్టించెనని కవులంటారు.
6. పరసులకు శుభకార్యములందు ఇది వుంటే నేగాని తృప్తితీరదా?
7. బాటసారులకు ప్రభుత్వము వారు వీనిని అచ్చటచ్చట వుచితముగా యేర్పాటు చేయుట మంచిది.
8. మనకంటే పెద్దవారైన పరాయి స్త్రీలను యీ విధముగా పాటించవలెను.
10. ఇది కంటిలో పడిన చాలా ప్రమాదము.
11. మనము స్వార్థపరులమాటలు విననకుండా వుంటే దీనిని పొందలేము.
12. ఇది చేయువారిని శిక్షించవలెను.
13. ఇదిలేని కూరలు రుచించవు.
15. వీనినిలో హామతో తయారు చేయుదురు.
16. తుడుపులు, దిద్దుపాట్లువున్నా, ప్రవేశరుసుము పంపని కూపన్లు యిలా చేయుదురు.
18. ఇది వచ్చేవరకు బ్రతుకుట చాలా వుత్తమమైన వాడని చెప్పవచ్చును.

ఆధారములు నిలువు

1. మన దేశమును దాస్యము నుండి విముక్తిగావించిన అమరజీవుడు
2. ఇది ఒక్కొక్కప్పుడు తెలుకు చుండును.
3. కొందరు వీటిని అమ్మకొని జీవనోపాయము చేయుదురు.
5. వన్నె కెక్కిన ఆంధ్రమహా కవులలో నొకడు.
6. ఈమె విశ్వామిత్రుని తపభంగము కలిగించినది.
7. వీటిని మనమందరము ఎకువగా వాడుట మంచిది.
9. ఎంతటివారైనను ఎప్పటికైనను ఈ రూపము పొందవలసినదే
14. మహా తీవ్రమైన ప్రభావము కలవాడు.
17. క్రూరుడు దీనిని పాటించకుండా మసులును.
19. సృష్టికర్త.
20. కొందరికి యీరకముబట్టలంటేయిష్టము
21. ఇది కాళ్ళకు గుచ్చుకొనకుండా చెప్పులువాడట మంచిది.
22. ఇదిలేనిదే వ్యవసాయము సాగదు.

నెం. 2 కి సొల్యూషను



CERTIFIED COPY

నిబంధనలు: ప్రవేశరుసుము కూపను 1 కి 0-8-0 చొ॥ గాని రూ. 1-0-0 కి 3 కూపన్లు చొ॥ న గాని ఎన్నిగానను తెల్లకాగితముపై గళ్లు గీసి వ్రాసిపంపవచ్చు. అచ్చుకూపన్లు కావలయువారు మాకు వ్రాసిన యెన్ని కూపనులు వుచితముగా పంపెదము. ప్రవేశరుసుము M. O. ద్వారా గాని, స్టాంపులు ఆర్డరుద్వారా గాని పంపవలెను. నెం. 3 పజిలులో వుండే పదములు వున్న పేపరు కావలసినవారు 0-4-0 పోష్టు టిక్కెట్లు పంపినవారికి పంపెదము. డిసెలో లేని పదములు పజిలులో వుంచినని గ్యారంటీ యిచ్చుచున్నాము.

మేనేజరు, తెలుగు క్రాసువర్డు పజిలు నెం. 3, జగన్నాథపురం, కాకినాడ.

నెం. 2 లో బహుమతులు పొందినవారి పేర్లు 10-9-52 వ తేదీన నెం. 4 తో పత్రిక వారపత్రికలో ప్రచురింపబడును. ఏజంట్లు కావలెను.